


Level 2

# అగ్గిపెట్టె చిన్నదా పెద్దదా?

**Author:** Arvind Gupta
**Illustrator:** Meenal Singh
**Translator:** Radha Madhavi Gokaraju



ప్రేమ్ తన ఇంటి దగ్గరలో ఉన్న మున్సిపల్ స్కూల్ లో రెండవ తరగతి చదువుతున్నాడు.

అతని టీచర్ కి ఎప్పుడూ ఎదో ఒక కొత్త ఆలోచన పుట్టుకొస్తూనే ఉంటుంది.



ఒకరోజు టీచర్, ఒక ఖాళీ అగ్గిపెట్టెను తీసుకుని దాని నిండా వీలయినన్ని వస్తువులు నింపమని పిల్లలందరికీ చెప్పారు.

"ఒక వారంలో, మీరు ఎన్ని రకాల వస్తువులు వీలయితే అన్ని రకాల వస్తువులతో ఆగ్గిపెట్టెని నింపాలి. అందరికంటే ఎక్కువ రకాల వస్తువులు ఎవరి అగ్గిపెట్టె లో ఉంటే వాళ్లకి వచ్చే వారం ఒక బహుమతి ఇస్తాను. "



ప్రేమ్ కి ఆ ఆలోచన చాలా నచ్చింది.

ఇంటికి వెళ్ళాక ఒక ఎరేజర్, ఒక షార్పెనర్ అగ్గిపెట్టె లో పెట్టడానికి చూశాడు. కానీ ఆ రెండిటిలో ఏదో ఒక్కటే అగ్గిపెట్టెలో పట్టింది.

అగ్గిపెట్టె చాలా చిన్నగా ఉంది.

ప్రేమ్ తన హోంవర్క్ చేస్తున్నప్పుడు పెన్సిల్ ముక్కు విరిగిపోయింది. దాన్ని తీసి అగ్గిపెట్టెలో పెట్టాడు.

కొంత సేపటి తర్వాత పెన్సిల్ చెక్కాడు. దాని నుండి వచ్చిన పలుచని చెక్కులని మళ్ళీ అగ్గిపెట్టెలో పెట్టాడు.

ప్రేమ్ ఇప్పుడు చిన్న వస్తువుల కోసం వెదకడం మొదలుపెట్టాడు.



వాళ్ళమ్మ చేస్తున్న అటుకుల ఉప్మా కమ్మటి
వాసన వచ్చింది.

వంటగదిలోకి వెళ్ళి, ఒక చిన్న ఆవగింజ,
ఒక జీలకర్ర విత్తనం, మిరపగింజ
తీసుకున్నాడు.

పంచదార పలుకు, బియ్యపు గింజ,
మినపగింజ కూడా తీసుకున్నాడు.

ఇంకా, మొక్కజొన్న, జొన్న, పెసర పప్పు
ఇలా రక రకాల గింజలు,
పప్పులు సేకరించాడు.



మరుసటి రోజు, ఒక చిన్న రబ్బరు బ్యాండ్,
ఊలు ముక్క, వెంట్రుక, దారపు ముక్క
అగ్గిపెట్టెలో పెట్టాడు.

ప్రేమ్ ఇప్పుడు చిన్న, చిన్న వస్తువులు
బాగా సేకరిస్తున్నాడు.
మరుసటి రోజు ఒక గులాబీ ముల్లు,
ఒక పొద్దుతిరుగుడు రేక,
ఒక చిన్న కొమ్మ, ఒక టీ ఆకు, ఒక చింత
ఆకు ఇంకా....
ఒక చిన్న రాయి.



అగ్గిపెట్టెలో ఇంకొంచెం ఖాళీ ఉంది.
ప్రేమ్ ఒక చిన్న కాగితం, ఒక పిన్, ఒక సూది, ఒక పూస, ఒక మేకు, ఒక చిన్న బటన్ అగ్గిపెట్టెలో పెట్టాడు.
అగ్గిపెట్టె ఇంకా నిండలేదు.
వారంలోని చివరి రోజున నిమ్మ గింజ, ఒక గుమ్మడి గింజ పెట్టాడు.

ఇప్పుడు అగ్గిపెట్టె నిండిపోయింది. ఇక పైన ఒక వస్తువు కూడా పట్టదు.



క్లాసులో ప్రతి ఒక్కరూ తమ అగ్గిపెట్టెలో ఎన్ని వస్తువులున్నాయో లెక్కపెడుతున్నారు.

కొంతమంది యాభై వస్తువులు, మరి కొంత మంది అయితే వంద వస్తువులు దాకా సేకరించారు .



ఇక ఇప్పుడు ప్రేమ్ వంతు.   ప్రేమ్ తన అగ్గిపెట్టెని గాలిలో కదిపాడు.
కానీ ఏ చప్పుడూ లేదు. మరి అది పూర్తిగా నిండిందిగా!
ప్రేమ్ తన అగ్గిపెట్టెని తెరిచినప్పుడు అందరూ ఆశ్చర్యపోయారు.



ప్రేమ్ తన అగ్గిపెట్టెలో నూట యాభై రకాల వస్తువులు పెట్టాడు!

అతను తెచ్చినన్ని ఎవరూ తీసుకురాలేదు.
ఇంకేముంది, ప్రేమ్ ఒక కొత్త రంగు పెన్సిల్ బాక్స్ గెలుచుకున్నాడు!

చూశారా, ఒక అగ్గిపెట్టెలో ఎన్ని ఉన్నాయో!

ఇప్పుడు చెప్పండి, అగ్గిపెట్టె చిన్నదా, పెద్దదా?

PRATHAM BOOKS
storyweaver



## Story Attribution:

This story: అగ్గిపెట్టె చిన్నదా పెద్దదా? is translated by Radha Madhavi Gokaraju . The © for this translation lies with Radha Madhavi Gokaraju, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Based on Original story: 'The Big, Big Matchbox', by Arvind Gupta . © Pratham Books , 2017. Some rights reserved. Released under CC BY 4.0 license.

## Illustration Attributions:

Cover page: Schoolchildren with matchboxes, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 2: Woman and children with matchbox, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 3: Woman bends sideways, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 4: Boy sits at table with cat, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 5: Cat and pencil, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 6: Boy smells food, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 7: Houses, trees, roads, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 8: Board pin, pair of hands, button, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 9: Red and white matchbox, by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license. Page 10: Open matchbox filled with things by Meenal Singh © Pratham Books, 2017. Some rights reserved. Released under CC BY 4.0 license.





# అగ్గిపెట్టె చిన్నదా పెద్దదా?

(Telugu)

ఒక అగ్గిపెట్టెలో మీరు ఎన్ని రకాల వస్తువులు పెట్టగలరు? ఒకటి, రెండు, మూడు....పోనీ పది? మరి ప్రేమ్ ఎన్ని పెట్టాడో తెలుసా? మీరీ కథ చదివితే అగ్గిపెట్టె ఇంత పెద్దదా అనుకుంటారు. మరి చదవండి!

చధువు దశ 2: తెలిసిన పదాలను గుర్తుపట్టి, కొత్త పదాలను కొంత సహాయంతో తెలుసుకుని చదివే పిల్లలకు

